శ్రీ
రాళ్లబండి విశ్వనాథశర్మ
మహా.
1 TO 23 Full

(1)

## మేలాపకం : set 4

వధూవరుల మానసిక, ధార్మిక, శారీరిక అన్యోన్యతను పరిశీలించుటకు నక్షత్ర మరియు రాశి పొంతనల పరిశీలన అవసరము. ఈ పొంతనను అష్టగుణకూటమి ద్వారా పరిశీలిస్తారు.
కేరళ, తమిళనాడు వంటి దక్షిణాది ప్రాంతాలలో 10 లేక 12 కూటములు పరిగణిస్తారు.

1. వర్ణ - 1
2. వశ్య - 2
3. తార - 3
4. యోని - 4
5. గ్రహమైత్రి - 5
6. గణ - 6
7. రాశి - 7
8. నాడి - 8
9. మహేంద్ర కూటమి
10. రజ్జు కూటమి
11. స్త్రీ దీర్ఘము)
12. వేధ

బ్రాహ్మణులకి గ్రహ మైత్రి. క్షత్రియులకి గణ మైత్రి, వైశ్యులకి వశ్యము, శూద్రులకి యోని కూటములు ముఖ్యమైనవి.
నాడి కూటమి, రాశి కూటమి , తారా కూటములు అందరికి ముఖ్యము.

### వర్ణము:

ఈ కూటమి జన్మరాశి ఆధారంగ చూడబడుతుంది.
జలతత్వ, అగ్నితత్వ, భూతత్వ వాయుతత్వ రాశులను వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర రాశులుగా చెప్పబడినవి.
వరుని జన్మరాశి వధువు జన్మ రాశికన్నా ఉన్నతమైన వర్ణము లేదా సమాన వర్ణమై వుండాలి. అట్లైన 1 లేదా 0 గుణములు ఏర్పడుతయి.

### 2. వశ్యము:

ఈ కూటమి జన్మరాశి ఆధారంగ చూడబడుతుంది. రాశులను వాటి ఆకృతుల ప్రకారం 5 విధాలుగా విభజించబడినవి.
అవి నరరాశులు, చతుష్పాదరాశులు, జలచర రాశులు, సింహరాశి,కీటరాశి.

| నర | చతుష్పాద | జలచర | కీట |
|---|---|---|---|
| మిధునం | మేషం | కర్కాటం | వృశ్చికం |
| కన్య | వృషభం | మకరం(రెండవ భాగం) | |
| తుల | | మీనం | |
| ధనస్సు(మొదటి) | ధనస్సు(రెండవ భాగం) | | |
| కుంభం | మకరం(మొదటి) | | |

వధువు మరియు వరుడు ఒకే విభాగంలోని రాశులైన ఉత్తమం.

ఇతర పరిస్థితులలో క్రింది పట్టికలో చూపిన విధముగా గుణములు ఏర్పడును.

వశ్యము, భక్ష్యము అనే అంశాలు రాశి యొక్క స్వభావాన్ని బట్టి నిర్ణయిస్తారు.

ఉదా:- నరరాశులకి సింహరాశి తప్పించి మిగతా రాశులన్ని వశ్యాలే.

జలచర రాశులు భక్ష్యాలు.

వధువు:- వరుడు:-

| | నర | చతుష్పాద | జలచర | సింహం | కీటరాశి |
|---|---|---|---|---|---|
| నర | 2 | 0 | 0 | 1/2 | 0 |
| చతు | 1 | 2 | 1 | 1/2 | 1 |
| జల | 1/2 | 1 | 2 | 1 | 1 |
| సింహం | 0 | 0 | 0 | 2 | 0 |
| కీటకం | 1 | 1 | 1 | 0 | 2 |

**3.తార:**

వధువు నుండి వరుడి నక్షత్రం లెక్కించి తారను పరిశీలించాలి. అలాగే వరుని నక్షత్రంనుండి వధువు నక్షత్రం వరకు లెక్కించి తారను పరిశీలించాలి.

1) జన్మ 2) సంపత్ 3) విపత్ 4) క్షేమ 5) ప్రత్యక్ 6) సాధన 7) నైధన
8) మిత్ర 9) పరమ మిత్ర అని తారలు 9 రకములు.

ప్రధమ నవకంలో జన్మతార, ద్వితీయ నవకంలో విపత్తర, తృతీయ నవకంలో ప్రత్యక్ తార మూడు నవకాలలో విపత్తారలను వదిలివెయాలి.

వరునినుండి వధువుకు మరల వధువునుండి వరునికీ శుభ తారలైన 3 గుణములుల లేనిచో 11/2 గుణములు వచ్చును.

## 4. యోని:

జన్మ నక్షత్రము ఆధారముగా యోనిమైత్రి చూడబడును. ప్రతి నక్షత్రానికి ఒక జంతు యోని సూచించబడినది.

| నక్షత్రము | జంతుయోని | శత్రుయోని |
|---|---|---|
| అశ్విని, శతభిషం | గుర్రం | మహిషం |
| స్వాతి , హస్త | మహిషం | గుర్రం |
| ధనిష్ఠ, పూ.భాద్ర | సింహం | ఏనుగు |
| భరణి, రేవతి | ఏనుగు | సింహం |
| పుష్యమి, కృత్తిక | మేక | కోతి |
| శ్రవణం, పూ.షాఢ | కోతి | మేక |
| ఉ.షాఢ, అభిజిత్ | ముంగిస | పాము |
| రోహిణి, మృగశిర | పాము | ముంగిస |
| జ్యేష్ఠ, అనురాధ | లేడి | కుక్క |
| మూల, ఆర్ద్ర | కుక్క | లేడి |
| పునర్వసు, ఆశ్లేష | పిల్లి | ఎలుక |
| మఖ, పుబ్బ | ఎలుక | పిల్లి |
| విశాఖ, చిత్త | పులి | ఆవు |
| ఉత్తర, ఉ.భాద్ర | ఆవు | పులి |

వధూవరులవి ఏక యోని అయితే 4 గుణములు

మిత్ర యోనులయితే 3 గుణములు

సమ యోనులయితే 2 గుణములు

శత్రు యోనులయితే 1 గుణములు

అధి శత్రువు లయితే 0 గుణములు

## 5. గ్రహ మైత్రి:

వధూవరుల రాశ్యాధిపతులు ఒకరే అయిన లేక పరస్పర మిత్రులైన - 5 గుణములు

ఒక వైపు నుంచి మిత్రత్వము, రెండవ వైపు నుండి సమత్వము - 4 గుణములు

రెండు వైపుల నుండి సమత్వము - 3 గుణములు

ఒక వైపు నుంచి శత్రుత్వము, రెండవ వైపు నుండి సమత్వము - 1 గుణములు

ఒక వైపు నుంచిసమత్వము, రెండవ వైపు నుండి మిత్రత్వము, - 1/2 గుణములు

పరస్పర శత్రుత్వము - 0 గుణములు

రాశిచక్రంలో గ్రహ మైత్రి లేకపోయిన, నవాంశ చక్రములో గ్రహ మైత్రి ఉంటే గ్రహ మైత్రి ఉన్నట్లే.

**6. గణమైత్రిః** నక్షత్రాల ఆధారంగా 1) దేవగణం 2) మనుష్యగణం 3) రాక్షసగణం అని మూడు గణాలుగా విభజించారు.

**దేవగణం ః** అనురాధ, పునర్వసు, మృగశిర, శ్రవణం, రేవతి, స్వాతి, హస్త, అశ్విని, పుష్యమి

**మనుష్యగణం ః** పూర్వాభాద్ర, పూర్వాషాడ, పుబ్బ, ఉత్తరాషాడ, ఉత్తర, రోహిణి, భరణి, ఆరుద్ర

**రాక్షసగణం ః** మఖ, ఆశ్లేష, ధనిష్ట, జ్యేష్ఠ, మూల, శతబిషం, విశాఖ, కృత్తిక, చిత్త

| వధువు | వరుడు | | |
|---|---|---|---|
| | దేవగణం | మనుష్యగణం | రాక్షసగణం |
| దేవ | 6 | 5 | 1 |
| మనుష్య | 6 | 6 | 0 |
| రాక్షస | 6 | 0 | 6 |

రాశ్యాధిపతులకు మైత్రి ఉంటే, గణదోషమున్నా వివాహం చేయవచ్చు.
క్షత్రియులకు ముఖ్యంగా గణమైత్రి చూస్తారు.

**7. రాశి / భకూట ః**

వధూవరుల జన్మరాశులు ఒకదాని కొకటి 3/11, 4/10, 1/7 స్థానాలలో ఉంటే శుభము.
ఏకరాశి, సమసప్తకం, తృతీయలాభం, చతుర్థ దశమం మంచివి.
2/12 - నిర్ధనత్వం 5/9 - సంతానహాని 6/8 - ఘర్షణ, మృత్యుపదం కలిగిస్తాయి.

పరిహారాలుః

రాశి కూటమి దుష్టమైన ఏకాధిపత్యం పడితే మంచిది (శని, కుజ, శుక్రులు)

రాశ్యాధిపతులకు మైత్రి ఉన్న రాశిదోషం పోతుంది( మీన, సింహాలు, మేష ధనస్సులు)

తారాశుద్ధి ఉన్నప్పుడు రాశి కూటం లేకున్న దోషముండదు.

నవాంశ రాశ్యాధిపతులు మిత్రులైన నాడీ దోషం లేనప్పుడు రాశి దోషముండదు.

2/12 మీనాదిగా ద్విద్వాదశాలు శుభప్రదాలు

2/12 మేషాదిగా ద్విద్వాదశాలు అశుభప్రదాలు

6/8 మేష వృశ్చికాలు, వృషభ తులలు, కర్కాటక ధనస్సులు, మీన సింహాలు, మకర మిధునాలు, కన్య కుంభాలు మిత్ర షష్టాకాలు

మేష, కన్య; తుల, మీన; వృషభ, ధను; మిధున, వృశ్చిక; కుంభ, కర్కాటక; సింహ మకరాలు అశుభ షష్టాకాలు

పురుష రాశి నుండి పంచమరాశి స్త్రీ రాశి అయితే సంతాన నష్టం

స్త్రీ రాశి నుంచి పురుష రాశి పంచమ రాశి అయితే సంతాన సౌఖ్యం

కర్కాటకం - వృశ్చికం, కన్య -మకరం, కుంభం - మిధునం, మీనం - కర్కాటకం అశుభ నవపంచకాలు.

8. నాడిః ( నక్షత్ర ఆధారం)

27 నక్షత్రాలను ఆది, మధ్య మరియు అంత్యా అని మూడు నాడులుగా విభజించారు.

| ఆది | మధ్య | అంత్య |
|---|---|---|
| అశ్వని | భరణి | కృత్తిక |
| ఆర్ద్ర | మృగశిర | రోహిణి |
| పునర్వసు | పుష్యమి | ఆశ్లేష |
| ఉత్తర | పుబ్బ | మఖ |
| హస్త | చిత్త | స్వాతి |
| జ్యేష్ట | అనూరాధ | విశాఖ |
| మూల | పూర్వాషాఢ | ఉత్తరాషాఢ |
| శతభిషం | ధనిష్ట | శ్రవణం |
| పూర్వాభాద్ర | ఉత్తరాభాద్ర | రేవతి |

వధూవరులది ఏకనాడి కారాదు

నాడీ కూటమి శిరోమణి వంటిది కాబట్టి అత్యంత ప్రాధాన్యమిచ్చారు

నాడీ కూటమి సరిగా లేకుంటే మిగతా ఏడు కూటములను నాశనం చేస్తుంది

ఆదినాడి ఏకనాడి అయితే వియోగం

మధ్యనాడి అయితే ఇరువురికి నాశనం

అంత్యనాడి అయితే వైధవ్యం

తప్పని సరి అయితే నాడీ దోష పరిహారానికి మృత్యుంజయ జపం, స్వర్ణ దానం చేయాలి

ఏకనాడి అయితే రెండు నక్షత్రాలు ఒకేరాశి లో వున్నప్పుడు నాడీ దోషం పోతుంది

ఏకనాడి అయితే 0 గుణములు వేరునాడులు అయితే 8 గుణములు.

ఈ అష్టగుణకూటమి చంద్రరాశినుండి చంద్రరాశినుండి పరిగణిస్తారు.

రవి - ఆత్మ, లగ్నం - శరీరం, మరియు చంద్రుడు - మనస్సు కావున ఈ అష్టగుణకూటమిని రవి మరియు లగ్న నక్షత్రాలనుండికూడా పరిశీలించిన ఉత్తమమైన ఫలితాలు పొందవచ్చు.

- - -

### ఏక నక్షత్రాలుః

రోహిణి, ఆర్ద్ర, మఖ, హస్త, విశాఖ, శ్రవణం, ఉ.భాద్ర, రేవతి నక్షత్రాల పాదభేదం ఉన్నప్పుడు వధూవరులకు ఏక నక్షత్ర మైన వివాహం చేయవచ్చును.

### మూలాది దుష్ట నక్షత్ర అపవాదులుః

మూలలో జన్మించినచో మామగారికి, ఆశ్లేషలో జన్మించిన అత్తగారికి, జ్యేష్టలో జన్మించిన బావగారికి, విశాఖలో జన్మించిన మరిదికి దోషము.

నారద వచనాన్ని అనుసరించి ఆయా గండాలకు కాలపరిమితి వుందని శాంతి చేసుకుంటే ఆ దోషం వుండదని స్పష్టమవుతుంది.

తండ్రి కి దోషం 1 సంవత్సరం లో, బావమరిదికి 8 సం||లలో, తల్లికి 3 సం||లలో, ధనానికి 2 సం||లలో, మామగారికి 9 సం||లలో, అన్నకు 5 సం||లలో, మిగిలిన వాటికి 7 సం||లలోను దోషం కనిపిస్తుంది.

ఇవి బాల్య వివాహాలు జరిగే సమయం ఉన్న నమ్మకాలు. జననాది 9 సం||లు కాలపరిమితి దాటిన తరువాత ఆ దోషముండదు. ప్రస్తుత కాల మాన పరిస్థితులలో ఈ సూత్రాన్ని లక్ష్య పెట్టనవసరం లేదు.

త్రిజ్యేష్ఠః

మూడు జ్యేష్ఠలు కలువకూడదు. జ్యేష్ఠుడు, జ్యేష్ఠురాలు, జ్యేష్ఠా నక్షత్రం, జ్యేష్ఠమాసం, వీటిలో మూడు కలవరాదు.

ప్రథమ సంతానం మాత్రమే జ్యేష్ఠుడు

తల్లికి తొలిచూలు పిల్లమాత్రమే జ్యేష్ఠురాలు.

దశలుః

అష్టక వర్గ రీత్యా రాబోయే కనీస 10 సం॥ల దశాకాలం బలంగా, అనుకూలంగా ఉండాలి.

ఇద్దరికి దశాచ్ఛిద్రం కాకూడదు. వధూవరులిరువురికి దశాచ్ఛిద్రం నడువరాదు.

ఇద్దరికి అనుకూల దశలు నడుస్తూ ఉంటే మంచిది.

కుజదోషం ః

ఎవరి జాతకంలో అయినా 1, 2, 4, 7, 8, 12 భావాల్లో కుజుడున్న కుజదోషం ఏర్పడుతుంది. ఈ కుజదోషం ఉన్న వ్యక్తులకి కళత్ర నష్టమని చెపుతారు.

ఈ కుజదోషాన్ని జన్మలగ్నం నుండే కాకుండా చంద్ర లగ్నం, శుక్ర లగ్నం నుండి కూడా పరిశీలించాలి.

ఈ కుజదోషం ఉన్న వ్యక్తులని, కుజదోషం ఉన్న వ్యక్తులతోనే వివాహం చేయాలి.

పరిహారాలుః

రెండు జాతకాలలో కుజుడు దోష స్థానాల్లో ఉంటే కుజదోషముండదు

ఒక జాతకంలో కుజుడు దోషిగావున్న స్థానంలో రెండవ జాతకంలో మరో పాపగ్రహముంటే దోషం పరిహారమవుతుంది

1, 4, 7, 8, 12 స్థానాల్లో రాహువుంటే కుజదోషముండదు.

మేష, వృశ్చిక లగ్నాలకి కుజుడు ఎక్కడున్నా దోషం లేదు

కుజుడు ఉచ్ఛలో కాని. స్వక్షేత్రం లో కాని, మిత్ర క్షేత్రంలో కాని ఉంటే కుజదోష ముండదు.

కుజుని పై గురు దృష్టి ఉన్నా, కుజునితో గురుయుతి కలిగి ఉన్నా కుజదోష ముండదు.

మేషరాశి లగ్నము, ధనస్సు వ్యయము, వృశ్చికము చతుర్థము, మకరం సప్తమం, కర్కాటకం అష్టమం అయినప్పుడు అందు కుజుడున్నపుడు కుజదోషముండదు.

కుంభ లగ్నానికి కుజదోషం లేదు

0 0 0

పరిఘ చక్రం :

తూర్పు - కృత్తిక; దక్షిణం- విశాఖ; పడమర - అనూరాధ, శ్రవణం; ఉత్తరం-ధనిష్ఠ ఏ దిక్కున ఏ నక్షత్రాలు ఉన్నాయో, ఆ దిక్కుకు ప్రయాణం చేయరాదు.

దగ్ధయోగం :

ఏకాదశి సోమవారం; ద్వాదశి శనివారం; షష్ఠి గురువారం; తదియ బుధవారం; అష్టమి శుక్రవారం; నవమి ఆదివారం; పంచమి మంగళవారం దగ్ధయోగం ఏర్పడుతుంది.

నక్షత్రం - వారం

భరణి - ఆదివారం; చిత్త - సోమవారం; ఉత్తరాషాడా - మంగళవారం; ధనిష్ఠ - బుధవారం; ఉత్తర - గురువారం; జ్యేష్ఠ - శుక్రవారం; రేవతి - శనివారం - దగ్ధయోగాలు

ఈ సమయంలో ప్రయాణాలు చేయరాదు.

ఇద్దరి చక్రాలలో లగ్న సప్తమాధిపతులు మరియు చంద్రాత్ రాశి సప్తమాధిపతుల పరిశీలన తప్పనిసరిగా చేయాలి

జన్మనక్షత్రాలు పొంతన, జన్మచక్రాల మైత్రి, నవాంశ పరిశీలన కుడా చేయాలి

ప్రముఖ దృక్‌సిద్ధాంత పంచాంగాలలో చెప్ప గుణములు 18+ గుణములు ఆధారంగా చేసుకోవాలి, ముహూర్తము మరియు దైవానుగ్రహము, తల్లి, తండ్రి ఆశీస్సులు ము 9/0 మానవలో సత్ప్రవర్తన అని కూడి జీవన దాంపత్య శుభఫలితాలు కలుగుతాయి.

శ్రీమాత్రే నమః